శ్రీ

# అభినవకుమతిశతకము

మొదటిభాగము.

గ్రంథకర్త:

గాజులపల్లి వీరభద్రరావు.

1926.

 వెల. 0—2—0

# అనుభవచికిత్సాదర్పణము

రెండవముద్రణము. దళసరికాగితములు. చక్కనిఅచ్చు.

గ్రంథకర్త: వైద్యపండిత

వసంతపురం లోకరాజు మునయ్యగారు.

బదిసంవత్సరములుగ లోకమునందనేక స్థలములందు
గాగింపఁబడి యనేకులను రక్షించిన బ్రహ్మశ్రీ వైద్య
లోకరాజు వసంతపురము మునయ్యగారి, అనుభవ
వాడి గుణమిచ్చిన ఔషధములను కొంచెమైనను
పెట్టక బాలురుసయితము నమ్మకముగా యియ్యఁ
ఔషధములను జేయుపద్ధతులను వ్రాయఁబడినది.
స్తకము సహాయమున ఎంతమాత్రపు ప్రాథమిక
నము గలవారయినను తమంతటఁదామే ఔషధముల
గలరని మానమ్మకము. యీగ్రంథమునందు సుమా
రుటలు, 1800 చికిత్సలుచేయుటకు చక్కని తేనెలో
తెనుఁగుపద్యములు బాలురకు సయితము అర్థమ
చ్చుటచ్చుటకఠినపదములకు తెలుగు టీకాతోసహా
యఁబడినది. ఈగ్రంథమునందలి చికిత్సలలో నొక్కటియై
నను గుణమునిచ్చుటకు దప్పినదని రుజువుచేసిన సొమ్ము
వాపసుయియ్యబడును. వెల. రు 2-8-0 లు.

జనోపకారిణీస్టోర్సు, ప్రొద్దుటూరు.

శ్రీ

# అభినవకుమతిశతకము

మొదటి భాగము.

గ్రంథకర్త:
గాడేపల్లి వీరభద్రరావు

1926.

 వె. 0-2-6

# పీఠిక.

అభినవకుమారశతకము. ఇది ఆధునికకవులలో నొక ... గాజులపల్లి వీరభద్రరావుగారిచే రచింపఁబడియె. ఆంధ్రభాష ఇతనికి దేశభాషయే. ఇతని కవనమందు కందపద్యరచనమె ప్రధమ కృత్యము. సునీతిబోధకములగు సామెతలు ప్రతిపద్యమందు నిండియున్నవి. వేయేల. ఆంధ్రపాఠశాలాధికారులు బాలురకు పఠనీయగ్రంథముగ సంగ్రహింతురని తలంచెద. ఇంకను గొన్నిగ్రంథములయం దితనికి రచనా కుతూహలము కలదని తెలియవచ్చుచున్నది. రచనావైశారద్యము సోపానసరణివలె ఔన్నత్యము నందుఁగాత.

ఇట్లు,

భాకరాపేట.
3—6—.26

రాయపెద్ది, వెంకటరమణయ్యశాస్త్రి.

# విజ్ఞప్తి

సంస్కృతభాషయందు గాని, యాంధ్రభాషయందు గాని నాకు పాండిత్యము బొత్తుగాలేదు. సామాన్యముగ ప్రాథమిక పాఠశాలలలో నేర్పించు వ్యాకరణ సూత్రములైన నేనెఱుగను. విశేష గ్రంథావలోకనము వలనను, ఆంధ్రపత్రికాపఠనమువలనను, నేగడించిన భాషాజ్ఞానముచే యీశతకాది గ్రంథముల వ్రాయ సాహసించితిని. పండితవరులు యిందలి లోపములను దయతో నెఱుకపఱచిన బునర్ముద్రణమున సవరించి దిద్దుకొనెద. ఇందు నాయనుభవమునకప్పుడప్పుడు, దోచిన నీతుల శక్తికొలది బొందుపఱచితి. ఎటులైనను నేనొక గ్రంథకర్తను గావలెనన్న కుతూహలము నన్ను ద్రేరేప పండితసంస్కారణములైన బొందకయే నీశతకము బ్రకటింపదలచిన నన్ను పండితోత్తములు మన్నింప బ్రార్థించెద. పిట్ట చిన్నది కూత పెద్దది యను లోకోక్తిచొప్పున శతకమునకును విభాగములా? యని నన్ను బ్రశ్నింపవచ్చును. అందుకు నేరచించిన రెండువందల పద్యముల నొకమారచ్చొత్తింపలేని నా ధనలోపమే ముఖ్యకారణము. ఈచిన్న పొత్తమునకు బీఠికవ్రాసిన వారికిని, అల్పవ్యయమునకే యచ్చొత్తి జానకీ ముద్రణాలయాధిపతులకును కృతజ్ఞతాపూర్వ వందనము లర్పించుచు నింతటితో విరమించెద.

ఆనువారిపల్లి.
16—6—6

ఇట్లు, బుధజనవిధేయుడు.
గాజులపల్లి వీరభద్రరావు.



# సుమతి శతకము.



శ్రీకారము గృతిమొదలను
బ్రాకటముగ నిలుపుకవుల పద్ధతివలెనే
వాకొన బూనితి నేనును
శ్రీకాంతుని నామమిందు జెలగన్ గుమతీ. 1.

క॥ కందము యందం బగునని
పొందుగ సమకూర్చి నీతి పుంజములిందున్
జందగ వ్రాసెద శతకం
బంధముగా కవులుమెచ్చ నరుదుగ గుమతీ. 2.

క॥ నీవలె దేవుని పుత్రులె
నీవలె ప్రాణంబు లోకజె నీతియు నొకటే
నీవలె జూడుము సర్వుల
నీవలె జూడంగ మేలునీకగు గుమతీ. 3.

క॥ పనిలేక పరుల యిండ్లకు
జనదగ దేవేళ నెంత సాధువులైనన్

చనినఁ వచ్చును నిందలు
మనమున యోజించిదీని మానుము కుమతీ. 4.

క॥ సరసం బెవ్వరి తోడను.
విరసంబే తెచ్చుచుండు విపరీతముగా
పరసతుల తోడ నెప్పుడు
సరసము సరిగాదు మాను చయ్యన కుమతీ. 5.

క॥ నాలుకపై రుచి గోరకు
చాలఁ ప్రియ మిద్ధియనుచు సర్వం బెలమిఁ
జేలవు నీవై తినకుము
నాలుకపై నుండబోదు నమ్ముము కుమతీ. 6.

క॥ ధనమును సంపాదింపఁగ
ననువగు రీతినె గాక యెప్పు రీతిఁ
గొనకొని కూర్పగ జూడకు
ఘనమగు కీర్తియును దాన కలవగు గుమతీ. 7.

క॥ కాసుకు బోయిన మానము
కాసులు వేయింటికైన గాదుర పొందఁ
కాసుకడ మాన మేటికి
వీసముగా గాంతువీవు వెఱ్ఱిని గుమతీ,

క॥ కులమే దైనను గానీ
యిలలో గుణమున్న నదియె యిచ్చును ఘనతఁ
సలలితమౌ సద్గుణమును
కులముతో బోల్పంగ నెందు గూడదు కుమతీ. 9.

క॥ ఋణమే కాల్చును మనుజుని
ఋణమే నిలువెల్ల జీల్చు రోగము పెచ్చున్
ఋణమెంత వారి కైనను
గణనకు రానీదుదాని ఘనమది సుమతీ. 10.

క॥ పలుకవలె జనము మెచ్చగ
పలుకంగా నగవు కాదు పల్కులు సభలన్
పలుకక న్నేరని చో భూ
తలమున బండవలె నుండ నగురా సుమతీ. 11.

క॥ కలకాల మొక్కరీతిగ
జలజాక్షున కైనగాని జరుగదు జగతిన్
గలవెన్నొ లైన నుండదు
కలకాలము దీనిదెలిసి గడుపర సుమతీ. 12.

క॥ వెలయాలి పొందు జేసిన
తొలగును మున్నుండె ధనము [illegible] దేహా
భుజబలము సడలునయ్యా
వెలవెలదుల పొందువలదు విడువర సుమతీ. 13.

క॥ పదుగురు కుమారు లేటికి
మునుమును గూర్పంగ నొక్క పుత్రుడె చాలున్
పదివేల చుక్కలందున
జదలం జంద్రుండె కాంతి సారము సుమతీ. 14.

క॥ పలుకగ వచ్చును నీతుల
బలుకంగా వచ్చు మఱియు పలుధర్మములన్

పలుకుల వలెనే నడుచుట
కలికాలము నందు మిగుల గష్టము కుమతీ. 15.

క॥ శకునము జూచియె చనవలె
శకునంబును జూడకెపుడు జనదగ దెపుడున్
శకునము సరిగా కుండిన
వికవికలా కార్యఫలము వినరా కుమతీ. 16.

క॥ ఎంతే కష్టము గలిగిన
సుంతయు దుఃఖింపకున్న శుకయోగివిగా
నెంతురు జనములు వింటగ
మంతనమున దీనిదెలిసి మనరా కుమతీ. 17.

క॥ చిత్తము శివు బూజింపగ
బత్తిని పర భామలందు బరపుట లెపుడున్
బొత్తుగ ఫల ముండదనెడు
సత్తెము గనుగొనుచు పూజ సల్పర కుమతీ. 18.

క॥ పరసతిని తల్లిగాగను
పరధనమును మన్నురీతి బాటించినచో
నరుడధిక పుణ్యతముడై
కరివరదుని కరుణబొంద గల్గుర కుమతీ. 19.

క॥ ఇల విద్య లెన్ని నేర్చిన
తెలివింతయు బొందలేరు తెలియని మనుజుల్
తెలివొకరి సొమ్ముగాదని
తెలిపెడి పలుకెంతొ నిజము తెలియర కుమతీ. 20.

క॥ నీవొకటి దలచి యుండిన
దైవం బింకొకటి దలచు తథ్యముగాగన్
నీవెపుడు ఫలము గోరక
నీవిధి నెరవేర్పు మేలు నీకగు సుమతీ.    21.

క॥ నీవెపుడు ఫలముగోరక
దేవునిపై భారముంచి స్థిరమతితోడన్
నీవన్ని పనులు సల్పిన
దేవుడు వృథసేయడంచు దెలియర సుమతీ.    22.

క॥ మగనికి వలవని దేదియు
దగందాం గోరక ప్రియంబు ధరసల్పినయా
మగువను రెండవ లక్ష్మిగ
యగుసని చెప్పంగవచ్చు నౌరా సుమతీ.    23.

క॥ కోటులు ధనమార్జించిన
కాటికి జనువేళలందు కాసొకటైనన్
దాటదు వాకిలి తనతో
నేటికి వ్యర్థంపుమోహ మిలలో సుమతీ.    24.

క॥ చేతిలొ బలముండంగనె
దాతై తానీయవలెను తగు దానంబుల్
వాతము చేతికివచ్చిన
నేతీరున నీయనేర్తు విలలో సుమతీ.    25.

క॥ నీలో పొగరుకు ముడియుచు
లోలాక్షులగాంచి మోహ లోలుడవగుచున్

యేలా రతులను గోరెదు
కాలుని సమ్మోంట వేగ్రిటు గనరా సుమతీ. 26.

క॥ మగనిని బాసిన మగువకు
సుగుణంబులవెన్నియున్న చూపకధాత్రిన్
మగడువిడిన ముండందురు
మగనివివేకంబదేల మాన్యత సుమతీ. 27.

క॥ పలుకుల నీతులు జిమ్ముచు
కులువలు తమ నడతలోన దొసగులు పోసగన్
వలపెరుగని వనితలవలె
పలపల దిరుగంగ నేమి బాగగు సుమతీ. 28.

క॥ ధనమున్న దానముండుట
వనముండిన గోకిలంబు వసియించుటయున్
జనులున్న నీతియుండుట
లోనగూడక వాసియెట్లు లుండును సుమతీ. 29.

క॥ తులలేని ధాన్యసంపద
లలయక గూర్పంగ జూతు రదినిల్వదు సూ
నులు కడుదరిద్రులగు నెడ
నిలుపంగా నెవరితరము నిరతేను సుమతీ. 30.

క॥ పూసాటు సొమ్ముగాంచిన
చేసాపగ బుద్ధిపోడము శివునకునైనన్
చేసాప కుందురెవ్వరు
పూసాటుగ సొమ్ము దొఱక పురుషుని సుమతీ. 31.

క॥ పోయకు పాముకు పాలను
చేయకు దుష్టాత్ముతోడి చెల్మిని యెపుడున్
రోయకు యిల్లాలి సొబగు
బాయకు సుజ్ఞాని చెల్మి బంధము కుమతీ. 32.

క॥ వాఁడెవరి తోడవచ్చిన
నీదింతయు నుండుతప్పు నిక్కముదాసన్
నీదేమియు తప్పుండక
వాఁడెవ్వరితోడ పొసగ బడదుర కుమతీ. 33

క॥ తన పలుకులెల్ల సత్యము
తనవైదము లెల్ల శాస్త్ర ధర్మంబనియున్
అనుకొనక నరుడు స్వయముగ
తన నడత పరీక్ష సల్పదగుర కుమతీ. 34.

క॥ కనుమూయు నంతలోపల
నొనగూడెడి మేలుకీళ్ల నొకటియునైనన్
గనుగొన జాలడు మనుజుడు
కనుగొన నరుశక్తియెంత ఘనమా కుమతీ. 35.

క॥ ఋతుకాల మందు మాత్రమె
రతిసల్పగ గోరు పసులు రతి మితిలేకన్
మతిలేని మనుజు పోలిక
నతిచపలత సలుపూన నౌరా కుమతీ. 36.

క॥ గడచితినిక నాకేమని
దుడుకున బల్కంగరాదు దూరపుదృష్టిన్

అడుగడుగుకు నీవేగతి
బడియెదవో దానిదెలిసి బ్రతుకర కుమతీ. 37.

క॥ కనకపు బొమ్మయగునెడ
ఘనమగు వస్త్రంబులేల గట్టగ ధరలో
జనమోహిత లగు సుదతులు
కనకపు బొమ్మల దాల్పగావలె కుమతీ. 38.

క॥ పదునైదు నాళ్లకొకపరి
పదిలముగా లంఘనంబు పాటించినచో
గడియ దజీర్ణపు రోగం
బడియే నేకాదశందు రాప్యలు కుమతీ. 39.

క॥ జననంబందున సోదరు
లనబడు వారలె పదపడియగుదురు శత్రుల్
ఘననీతి యుతుల సహితము
ధనమోహము నీతిబాపు తథ్యము కుమతీ. 40

క॥ ఒకరిని జెరిచెడి గుణ ముం
డ కధరనుండదు రహస్య టక్కరి తనమే
రికి నను మహాత్ముబోధన
సకలోర్వికి దెంతనీతి సారము కుమతీ. 41.

క॥ కడుపార నోగిరంబును
గుడువక బీద కిసుమంత గొనుమని బిచ్చం
బిడకను లుబ్ధత దిరుగా
డెడు వరుగతి వెనుకకాలు డేటుగుర కుమతీ. 42.

క॥ తురగము గుణసంయుతమని
తరుణులు సుకుమార్గటంచు దగదుర విడువన్
చులుకుగ నొకమార్గైనను
బెలుకక గుణవృద్ధియెట్లు పెంపగు గుమతీ. 43.

క॥ వనమున వాసము జేసిన
మనమున కర్మలము బోక మానవు లెవరున్
ఘనయోగులు కానేరరు
కననేరరు దేవునంచు గనుగొను కుమతీ. 44.

క॥ అదనెఱుగక నాథునితో
నిదిలే దదిలేదటంచు నేర్పించెడియా
ముదితతో కాపురము సలుపు
ట దియజునకు గూడ సాధ్యమానా కుమతీ. 45.

క॥ తనువుండిన మూన్నాళ్లలో
తినవలె నోటికి రుచిగను తీర్థంబులకున్
జనవలె గనవలె కోవిద
జనముల వినవలె సునీతిసారము గుమతీ. 46.

క॥ అలికుల వేణుల గూర్చిన
తలపులు మదినిండ నురులదవిలెడియా లే
ఖులచందంబుననే పురు
షులు వైవాహికము లాడజూతురు కుమతీ. 47.

క॥ ఎంతే లోకము పొగడగ
వింతగు ధర్మంబు జేసి వెలసినగానీ

సుంతయు ఫలముఁ గోరిన
గొంతెమవలె వాడుసంత కోపుటి కుమతీ. 48.

క॥ పరిపరి విధముల జూచిన
నిరవుగ సుఖ దుఃఖములకు యింతులె ధరలో
సరియగు భార్యతో సుఖమును
నరకము దుష్టాత్మయైన నాతితొ గుమతీ. 49

క॥ రోగము దెలియక వైద్యుడు
రోగికి మందీయ దగదు ధుర్వనముగధరలో
బాగుగ తెలియక యిచ్చిన
మూగకు నేర్పించుచదువు బోలుర కుమతీ. 50.

క॥ తనరోగము దెగుతెరవును
గననేరక యొరుచికిత్స గావింపంగా
పనిబూను నట్టివైద్యుని
ఘనమెంతని చెప్పవచ్చు గనుగొను కుమతీ. 51.

క॥ తన ఘనత యిట్టిదంచును
ఘనముగ వర్ణించి చెప్ప గావలె నటరా
వనమున గేదగియుండిన
ఘనవాసన గొల్పి ఖ్యాతి గాంచదె కుమతీ. 52.

క॥ తన నౌకరు నిందజేసిన
తనకెంతటి కోపమొదవు ధరనటువలెనే
తన నిందల కొరుల మనము
ఘనకోపం బొందునంచు గనుగొను గుమతీ. 53.

క॥ పాండిత్య మల్పమగు నెడ
పండిత గర్వంబుగల్గు తప్పక నెందున్
పాండితి పండిత నుండిన
యుండదు గర్వంబు నంత నుర్విని కుమతీ. 54.

క॥ కులమున వద్దిక యుండిన
తలచిన మాతాపితరుల దాకాశికి బో
న లభించున నెడి సామెత
తలపున నేవేళనుంచ వలయును కుమతీ. 55

క॥ అక్కర గడచిన మీదట
తక్కెడ విరుగంగగొట్టి తప్పక పోయిలో
గుక్కుట యని నీతియనుట
నొక్కెడ నీమనమునందు నుంచుము కుమతీ. 56

క॥ ఘనయోగి యైన గానీ
తనకాలము గానివేళ తరుణుల పొందున్
మనమున దాశించి మిగుల
ఘననిందల పాలుగాక గడచునె కుమతీ. 57.

క॥ వెలగల బట్టల దాల్చిన
కులమే మఱునంగ జేసి కూర్చును మదమున్
వెలగలుగు బట్టలెప్పుడు
వలదుర కట్టంగనీవు వసుధన్ కుమతీ. 58

క॥ క్రొత్తగ కోడలు వచ్చిన
యత్తలు మొత్తంగజూతు రదియేలనొకో

అత్తయు మునుదా నొక్కెడ
నత్తింటికి కోడలగుచు నలరదె కుమతీ. 59.

క॥ పతియనిన నీసడించుచు
పతియాజ్ఞల మీఱిముక్తి బడయగ మిగులన్
వ్రతముల సల్పిన పడతుక
పతిభక్తిని లేక ముక్తి బడయునె కుమతీ. 60.

క॥ పుక్కిటి పురాణమనిన
జొక్కుచు నీవిందువెపుడు సొంపుదలిర్పన్
మక్కువ హరిసంస్మరణము
దిక్కుకు బోవేలనీకు తెవులా కుమతీ. 61.

క॥ ఎప్పుడు జూచిన నితరుల
తప్పుల వెతుకంగ జూతు తప్పులు నీకున్
జొప్పడ కుండునె యెయ్యెడ
నొప్పులనే సల్పువార లుందురె కుమతీ. 62.

క॥ ధనమే మూలము నీతికి
ధనమే మూలంబు పాప తండములెల్లన్
ధనమెంత యుండియున్నను
ఘనమతులే వేళనీతి గడువరు కుమతీ. 63.

క॥ పలుమారు కోపమొందకు
చలనంబున్ గలుగనీకు శాంతముమదిలోన్
కలలైన కోపచిత్తున
కలవడునే గౌరవంబు లరుదా కుమతీ. 64.

క॥ వాసిగ తోఁచిన నీతుల
వ్రాసితి నీ శతకమందు పండితజనముల్
జేసనకడు మృదుశైలిని
వ్రాసిన వాఁడేను వీరభద్రుఁడ కుమతీ. 65.

ప్రథమభాగము సంపూర్ణము.



జానకీ ముద్రాక్షరశాల, ప్రొద్దుటూరు. సి 1/26.

ఈ గ్రంథకర్తగారిచే రచియింపబడి త్వరలో వెలువడనున్న యితర గ్రంధములు.

## అభినవకుమతిశతకము. (రెండవ భాగము)

జనసామాన్యమునకు చక్కగ బోధపడునట్లు లోకోక్తుల తో నిండియుండు నీతులగుమి. త్వరలో వెలువడును. ఆ ౨.

## సత్యవ్రత నాటకము

స్త్రీలగుణౌదార్యముల వెల్లడించుచు వ్రాయబడిన కల్పిత నాటకము. సత్యవాక్యపాలనమున అద్భుత సంకటముల కోర్చి కడతేరిన సతీతిలకముయొక్క చరిత్రము, కంటకడు జాలిపుట్టించును. స్త్రీ పురుషులకును, బాల బాలికలకు, పండిత పామరులకును, సుబోధకమగు మృదుశైలిలో రసవంతముగ వ్రాయబడినది. వెల. 1-0 0

## వామనచరిత నాటకము.

శ్రీ పోతనామాత్యకవివరుని భాగవతమందలి పద్యరత్నముల సందర్భానుసారముగ వాడకొనబడి మృదుశైలిలో వ్రాయబడిన పరమభాగవతోత్తము చరిత్రము. రు. వెల 1-0-0.

☞ కొలది ప్రతులుమాత్రమే ముద్రింపబడును పరఖాస్తు ముందుగ బంపుకున్నవారికే లభించును.

గ్రంధములు వలయువారు క్రింది చిరునామాకు వ్రాయుడు

గాజులపల్లి వీరభద్రరావు,
ఆనువారిపల్లి, పోరుమామిళ్లపోస్టు, కడపజిల్లా.

